శ్రీరస్తు.

# శ్రీ వేంకటేశ్వర శతకము.

అను

అపరాధ క్షమాపణ స్తవము

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

రచితము.

శుభమస్తు.

# శ్రీ వేంకటేశ్వర శతకము.



శా. శ్రీమత్సర్వదిశేంద్ర వాగ్రమణ గౌరీనాథముఖ్యామర
స్తోమారాధితపాదవారిరుహా! వక్షోధామ సంవేశిత
శ్రీమన్మంగళదేవతాస్మితసుధాస్నిగ్ధాంతరంగాంబుజా!
శ్యామాంభోధరసన్నిభాంగ! మునిలోలా! వేంకటేశప్రభూ

శా. భూమివ్యోమ జలాగ్నిమారుతమహాభూతస్వరూపా! జగ
త్స్వామీ! కామితదాయకా! కలియుగప్రత్యక్షదేవస్వరూ
పా! మంగాహృదయాబ్జభృంగ! సజలాబ్జశ్యామలాంగా! కృపా
ధామా! దివ్యసరిన్మణీజనకపాదా! వేంకటేశప్రభూ.

# శ్రీ వేంకటేశ్వర శతకము

శా. ప్రారంభంబున విఘ్ననాయకును నమోవాకంబులన్ గొల్చి, వా
ణీరామామణి నారసజ్ఞ నిలువన్ జేమోడ్పు లర్పించి త్వ
చ్చారిత్ర ప్రతిబింబమైన శతపద్యగ్రంథమున్ జెప్పి సం
సారాంభోధిఁ దరింప నెంచితిని యీశా వేంకటేశప్రభూ!

మ. జగతీమండలి గర్భగోళమున సంస్థాపించి పోషించు నీ
వుగదా రాజవు, నిన్నుఁ గొల్వఁదగు, నీవున్ మమ్ము రక్షింపగాఁ
దగుఁ గానీ మముఁ బోఁటి మర్త్యుల ధనార్థంబై భజింపంగ నే
మగుఁ బుణ్యంబొకో పూరుషార్థమొకో దేవా! వేంకటేశప్రభూ!

శా. ధ్యేయం బీవ కదయ్య! ధ్యానము భవద్దివ్యత్కృపావర్షపా
తాయత్తం, బిఁక ధ్యాతనైనను నెట్లాడింప నట్లాడ నా
కాయం బాత్మయు మున్న నీ కొసఁగితిన్ గర్తృత్వభోక్తృత్వముల్
నా యుల్లంబున సోఁకనీ కరయు మన్నా! వేంకటేశప్రభూ!

మ. నిగమాంతమ్ములు శాస్త్రముల్ నిగమముల్ నీ రూపు వర్ణింపఁగాఁ
దగ మంచున్ వెనుకంజవేయఁ గని యేతన్మాత్ర మాబుద్ధితోఁ
దగుదున్ నే నని నిల్చినందులకు చిత్తంబందు నీ మెచ్చు గం,
దుఁగదా యంచు మతిన్ ధృతిన్ గొని నుతింతున్ వేంకటేశ ప్రభూ!

మ. రసమా శూన్యము, భావనూ నహి, యతిప్రావీణ్యమా సున్న, వ్యాం
గ్యసమృద్ధంబును గా, దలంకృతులు పూజ్యంబుల్ సుమీ యిట్టి, నీ
రసమౌ మత్కవితాలవంబు రసికాగ్రస్వామి వౌ నీవు మె
చ్చ సమర్థం బగునే క్షమింపుమి యవజ్ఞన్ వేంకటేశ ప్రభూ!

శా. కాలుం గేలుఁ గదల్పరానియటు రోగగ్రస్త దేహుండనౌ
వేళన్ నీస్మరణంబు సల్పి నిను భావింపంగ నా వ్యాధి వా
తూలధ్వస్తపయోదపఙ్క్తి ఖిలమై పోలంగ నీనామ మిం
కేలా విస్మృతి గాంచఁగల్గుదును చంద్రా! వేంకటేశ ప్రభూ!

శా. ఆయాసంబు జనించె నింద్రియచయవ్యాపారముల్ గ్రుంకఁగా
నాయెన్, నిల్చుట దుర్ఘటం, బిఁకను దైవాయత్త మంచున్ జగ,
ద్ధేయుల్ వైద్యులు వీడుకొన్నతఱి నిన్ గీర్తింప నారోగముల్
మాయంజేసితి వెట్లు నిన్ మఱతు నన్నా వేంకటేశప్రభూ!

శా. ప్రాణం బూడఁగ సిద్ధమౌతఱి భవద్భవ్యాఖ్యతో *స్తోత్రని
ర్మాణం బేక్రియఁ జేసినాఁడనో వచింపంజాల, యుష్మత్కృపా
వేణీపాత్రుఁడ నౌట హేతు వని భావింతున్ మదిన్ దండ్రి! పా
షాణంబున్ నడపించునీకు నిది హెచ్చా వేంకటేశప్రభూ!

శా. ఆలోకింపక యూరకున్న నపు డెట్లైయుందునో యట్లుగా
కాలోకించితి సత్కృపాలసదపాంగాలోకనస్ఫూర్తి; నా
లీలన్ నాతను వుండునందనుక నా హృత్పద్మసద్మండవై
పాలింపంగదె యంచు మ్రొక్కెదను దేవా! వేంకటేశప్రభూ!

* చూ. దశపద్యస్తుతి.

శా. మంగామానసపద్మతోషహర! మహామాద్యత్సురారిచ్ఛటా
భంగోత్తంభితతీక్ష్ణచక్రకర! శుభ్యద్భక్తమోక్షప్రధా
నాంగీభూతకృపకటాక్షరుచిర! నిత్యానందనీరాకరా!
రంగచ్ఛృంగఫణీంద్రభూమిభృదగారా! వేంకటేశప్రభూ!

శా. స్వాంతంబందు సమస్త మీవ యని నిచ్చల్ ధ్యానముల్ జేయఁ బో
ధ్వాంతం బట్టుల చిత్త మంతయును జింతల్ గ్రమ్మి విజ్ఞానదీ
పాంతజ్యోతుల మ్రింగు, వీని నెటు పాయం బెట్టి యుష్మత్పద
ప్రాంతచ్ఛాయ సుఖింతునో తెలుపవయ్యా వేంకటేశప్రభూ!

శా. అభ్రచ్ఛన్నఖరాంశు నట్లెలుఁగ మాయావృత్తి నిన్నున్; రజ్జు స
ర్పభ్రాంతిన్ జగమెల్ల భేదమతితో భావింతు నయ్యయ్యో! యీ
దభ్రజ్ఞత్వము బోవు టెట్టుల? సమస్తం బెంక నీ కిచ్చితిన్
శుభ్రం బౌ భవదైక్య మిమ్ము వల దెచ్చుల్ వేంకటేశప్రభూ!

మ. బహుళాజ్ఞానవశుండనై నిరతముఀ బాపంబులఀ జేసినా
నిహమందుఀ బరమందు నా కెటుల యాత్మోత్కృష్టంబు చేకూరు, దు
స్సహుఁ డివ్వా డని నీవునుం గన కుపేక్షఀ బూనితే నెవ్వఁ డీ
బహుళాయాసికి దిక్కు దీనజనతాప్తా వేంకటేశ ప్రభూ!

మ. జననంబుల్ మృతులుఀ సతంబును నిజేచ్ఛాహీనతఀ గల్గుచుం
డిన వేసారక కాంచుచుండియుఁ బునర్నిరంధ్రసంసారభా
ధనె కాంక్షించుచు నంతముఀ గనక నీధ్యానంబు నొక్కింత చే
యని యస్మాదృశదేహికేది గతి యన్నా వేంకటేశ ప్రభూ!

మ. తనచుట్టుం గలజీవకోటి వపురంతం బందునే కాని నా
కును దేహాంతము కల్గునో కొ! యిటులే కూర్చుండు నంచుఀ సదా
మనమం దెంచుచుఁ బుత్రదారగృహనిర్మాణాదికార్యంబులఀ
దనివిఀ బొందనినాకు నేదిగతి యన్నా! వేంకటేశ ప్రభూ!

శా. స్వానందాప్తికినై సతంబు తనశయ్యం జేర్చి లాలించి య
న్యానక్రీడల ముంచి తెల్పు మెలఁతన్ బోఁ ద్రోయఁగా లేక నే
నై నిష్కామత వీడ దీనిగతి యే మౌనో కదా యంచు నీ
ధ్యానం బేమఱునాకు నేది గతి యన్నా వేంకటేశ ప్రభూ!

శా. నీకై చేసెడు నర్చనాదులయినన్ నిక్కంబుగాఁ బుత్రజా
యా కేదారసుఖాభివృద్ధి కని చేయం బూనితిన్ గాని యా
శాకాలుష్యవిహీనమానససరోజాతార్పణం బొప్పఁగా
నేకించిత్తు నొనర్ప లేదుసుమి సామీ వేంకటేశ ప్రభూ!

మ. ధన మార్జించినఁ గాని పల్కదు కళత్రం, బాపెకున్ సేవ స
ల్పినఁ గానీ సుతుఁ గాంచ, దాసుతుని లాలింపంగఁ బాల్మాల నే
హాని ప్రేమింప దటంచు మోహమున నే నెల్లప్పుడీ యీషణా
గ్నిని నింగాలసమాకృతిన్ బడసితిన్ శ్రీ వేంకటేశ ప్రభూ!

శా. సంసారాటవియందు యౌవనతరింసాఘాసలోలుండనై
హింసల్ లెక్కిడ కంగజన్మశబరాభీష్వాంతరాపాతినై
మాంసాసృక్స్రవనంబులన్ మది చలింపన్ లేడి య ట్లుంటి నీ
యంసం బూఁతనొసంగి కావఁగదవయ్యా! వేంకటేశప్రభూ!

శా. ఆశాపాశనిబద్ధచిత్తమున నశ్యంబౌ పదార్థంబునం
దాశం జెందుచుఁ జేయఁగూడనిది చేయంబూని లోకుల్ సదా
క్లేశంబుల్ ఘటియింపఁగాఁ దెగువ నేలీలం గనన్ లేక మే
లౌ శీలంబు తొలంగి వర్తిలుదు నన్నా వేంకటేశప్రభూ!

మ. మృగతృష్ణాసదృశాతిచంచలసుఖాపేక్షా నిదానంబులై
తెగ తెం పుండని దుఃఖరజ్జువులు బంధింపంగ నవ్వాని ద్రెం
పఁగఁబో నింకొకదుఃఖరజ్జు వది తెల్పింపన్ జూడ నింకొక్కఁ డి
ప్పగిదిన్ దుఃఖనిబద్ధుఁడైతి నిదె దేవా వేంకటేశప్రభూ!

మ. జననీగర్భము చేరుటాది సుఖలేశం బే నెఱుంగన్ జిరం
తనకర్మానుభవంబొ, నీదయ కపాత్రం బౌటనో కాని నూ
తనదుఃఖాకరమైన సంసృతిసముద్రం బీఁది పారంబు చే
రను యత్నించి మునింగితిన్ మనుప రారా వేంకటేశప్రభూ.

మ. భవసంబాధములెల్లఁ డిందఁగను నాపై సావధానంబుగా
భవదాఖ్యాస్మరణంబు సల్పుటకు సంభావింతు నే నాఁటి క
ట్లవునే శాంతతరంగసంభ్రమణ మానంభోధి మున్గంగ ను
త్సవ మొప్పన్ గనుచుండు మూర్ఖగతి గాదా వేంకటేశప్రభూ.

శా. కుంభీంద్ర ప్రతిమానయాన! ఫణిరాడ్గోత్రాగ్రసంస్థాన! సం
రంభగ్రస్త కుచేలధ్యాన! కమలారాగానుసంధాన! నీ
లాంభోదద్యుతిభాసమాన! మునిలోకాలంబనస్థాన! ఫు
ల్లాంభోజాత సమాననా! బుధనిధానా వేంకటేశప్రభూ.

మ. వ్యవహారార్థము కల్పితంబగు సభిఖ్యల్ గాని నీరూపభా
సివి నీ కొక్కసమాఖ్య యున్నె! హరియె శ్రేష్ఠుం డటం చొక్కరుల్
శివుఁడే శ్రేష్ఠుఁ డటంచు నొక్కరును ద్వేషింపంగ మిమ్ముం గనుం
గవతోఁ గన్గొని తూఁచి చెప్పిరె యెఱుంగన్ వేంకటేశ ప్రభూ.

మ. శివుఁడే సర్వనియామకుం డన విరాజిల్లున్ యథార్థంబు కే
శవుఁడే విశ్వనియంత యన్న నదియున్ సద్ధర్మ్యమై చెల్లుఁ గా
ని విరోధించి నిజేష్టదైవతము కంటెన్ లొచ్చ టం చన్యదే
వవినిందల్ పచరింప లాభ మెది దేవా! వేంకటేశ ప్రభూ.

మ. ఒకమా టీవె విధాతవై శివుఁడవై యోంకారరూపుండవై
సకలాశాపతిరూపమై జడమ్మున్ చైతన్యమై మాయ జెం
దక వెల్గొందెద వట్టి నిన్ను 'నిదమిత్థ' మ్మంచుఁ బల్కంగ వే
రికి శక్యంబు వచోఽతిదూరుఁడవె తండ్రీ వేంకటేశ ప్రభూ.

మ. శ్రుతులున్ శాస్త్రములున్ బురాణములు సంశోధించి తల్లక్షణా
న్వితమేధాయుతుఁ డౌనె కాని త్రిజగన్నిర్మాణసంరక్షణో
ద్ధతిదక్షంబుఁ జరాచరాంతరబహిస్స్థానంబునౌ నీమహః
ప్లుతి లక్ష్యంబుగ నేబుధుండు గనఁజాలున్ వేంకటేశప్రభూ.

మ. స్థిరచిత్తంబున నేజనుం డయిన నీ దివ్యప్రభావంబులన్
స్మరియింపన్ భవతాప మొక్కపఱి ధ్వస్తంబౌట సచ్చిత్సుఖా
ధ్వరమందున్ యజమానుఁ డౌచు మదమాత్సర్యాదులన్ జ్ఞానవ
హ్ని రహిన్ వేల్చి తనంత ముక్తి గనకున్నే వేంకటేశప్రభూ.

మ. అమనస్కత్వము మస్కరీంద్రు లమితాయాసంబునన్ బొంది యు
త్తమభావత్కమహోర్మిరిన్ మునిఁగి యద్వైతస్థితిన్ గాంచఁగా
విమనస్కత్వము నొంది సంసృతిర్మురీవీచీనిమగ్నాంతరం
గమునన్ గుందుదు దిక్కు లేక కమలాక్షా వేంకటేశప్రభూ.

శా. ప్రారబ్ధాహ్వయవజ్రపాత మిదె నాపక్షంబులన్ ద్రుంపఁగాఁ
జేరన్ వచ్చె ననన్యరక్షుఁడను నిస్సీమంపు నీ సత్కృపాం
భోరాశిన్ నను డాఁచి కట్టుకొను మీపుణ్యంబు యుష్మద్దృశో
దారుల్ సత్కులగోత్రసూత్యభయదాతల్ వేంకటేశప్రభూ.

శా. ప్రారబ్ధం బది తప్ప, దైనను భవత్పాదాబ్జమాధ్వీఝరీ
ధారల్ గ్రోలినవాఁడు దేహము మహాసక్తిన్ దాని కర్పించి త్వ
త్కారుణ్యామృతవారిరాశిలహరీకల్లోలకేళీకళా
పారీణాత్మత హాయి నొందఁడె తలంపన్, వేంకటేశప్రభూ.

మ. శర ణంటిన్ నను రక్ష సల్పినను శిక్షన్ సల్పినన్ నీపదాం
బురుహచ్ఛాయలఁ బాయఁజాల హృదయంబున్ నీకు నర్పించుటన్
భర మెల్లన్ దొలఁగెన్, భుజంబున జగద్భారంబు పూనంగ నే
ర్పరివో నీకుఁ దృణంబుఁగాను గద దేవా! వేంకటేశప్రభూ.

మ. పరమార్థం బిది యంచుఁ దెల్పినను బ్రాగ్భావంబులం దింతయున్
బరిణామంబు ఘటిల్ల దుల్లమున తాపం బింత పోదామె నీ
కరుణాపూరము నాపయిన్ జిలికి నీగ స్ఫూర్తిగాఁ జేసి యు
త్తరజన్మంబుల నేని ముక్తి యిడరాదా వేంకటేశప్రభూ.

శా. అంధుల్ మార్గముఁ గాంచలేని క్రియ నిన్నాత్మస్థితున్ దుర్మద
గ్రంథిన్ గన్నుల కాంధ్య మబ్బుటఁ గనంగా లేక నాకంటె మో
హాంధత్వమ్మున స్రుక్కువారలు సహాయం బంచుఁ గొల్తున్ జగ
ద్బంధూ! తెల్పఁగదయ్య త్రోవ గనుపింపన్ వేంకటేశప్రభూ.

మ. సకలావసల నేను నాది యనుకాంక్షన్ జేయరానట్టి పా
తకముల్ చేయుదుఁ గాని కంఠగతముక్తాశ్రేణి చందాన నా
దకళాబిందుయుతున్, మదాత్మనిలయున్ దత్త్వంబు నాపాదమ
స్తకవాసున్ నినుఁ గాంచ లేనయితి నీశా వేంకటేశప్రభూ!

శా. నానాప్రాణిహృదంతరాలయు ననంతా నిన్ను నేరీతిగా
ధ్యానింతున్, హృదయంబు సంసృతిమహాయాసంబునన్ భిన్నమై
మ్లానంబయ్యెను నీకు నాకు నెటుసంబంధంబు చేకూరు, నీ
దీనున్ నీవును వీడితే శరణ మేదీ వేంకటేశప్రభూ!

మ. జలదశ్యామలకోమలాంగ! పదకంజాతప్రసన్నాంగ! ని
ర్మల కీర్తిప్రసరప్రసంగ! సుకుమారత్వాదృతానంగ! స
త్ఫలదాపాంగ! రమామనోంబుజమరందప్రీతహృద్భృంగ! స
మ్యగుపప్రేష్యజనానుషంగ! గిరిరంగా! వేంకటేశప్రభూ!

శా. సంకల్పంబులు బుద్బుదంబులటు సంజాతంబులై తోడనే
క్రుంకున్ జిత్తము కోతి యయ్యె నెటు నీకుం గొల్వొనర్తున్ నిరా
తంకం బైనమనం బొసంగి నిజభక్తశ్రేణిలోఁ జేర్చుకో
మ్మింకన్ నాయొనరించుసర్వమును నీదే వేంకటేశప్రభూ!

శా. సూర్యాదిగ్రహమండలంబు లెపుడున్ సూచ్యగ్రమం తేని ద
త్కార్యం బేమఱకుండ శూన్య మగునాకాశంబునన్ బోవునా
శ్చర్యప్రక్రియ సాధనంబుగ భవత్సత్తాక్రమంబున్ సుధీ
వర్యుల్ మున్న యెఱింగి రేల కనుగప్పన్ వేంకటేశప్రభూ!

శా. జన్మం బెత్తినదానికిన్ ఫలము యుష్మన్నామపీయూషపా
నోన్మత్తుండయి విశ్వమున్ మఱచి పుంయోషావిభేదంబు నే
తన్మాత్రంబును లేక దృశ్యము సమస్తం బీవె యంచు న్నీ
చిన్మాత్రంబును గాంచి పొంగుటెకదా శ్రీ వేంకటేశప్రభూ!

శా. నీనామస్తవనంబు సేయుట జగన్నేతా మహాచంచలా
ర్థానీకభ్రమ డింది శాశ్వతసుఖవ్యాసంగినై యుండెదన్
గానీ యీపరమార్థమున్ దెలిసియున్ గాపింప గాఁజాల నా
లో నున్నట్టి కొఱంతఁ దెల్పినను జాలున్ వేంకటేశప్రభూ!

శా. చంచత్కుండలగండమై స్ఫురితసద్దేశప్రస్ఫురన్నేత్రమై
త్వంచన్ముగ్ధదరస్మితాధరమునై బాలేందులీలాలికో
దంచత్పుండ్రమునై వినీలచికురంబై యొప్పు నీ యాస్యముఁ
గాంచన్ గోరుదుఁ జూపు మొక్కపటి యన్నా వేంకటేశప్రభూ!

శా. జ్యోత్స్నాకల్పదరస్మితం బొలుకునీచూపుల్ కటాక్షింపు నా
కృత్యాఘంబులు భస్మమౌనటుల; యెన్నో జన్మముల్ గంటి నీ
మృత్యాతుల్యపు మేను తప్ప; దిక సామీ! నన్ను నీదివ్యసం
విత్సత్తుం బొనరించి యైక్యమును నీవే వేంకటేశప్రభూ!

శా. కుండల్యుత్తమసంచకల్పితసుధాకూపారపుత్రీభుజా
ఖండాలింగన సౌఖ్యవిస్మృతి చలద్గర్భస్థితామేయవే
దోండత్రాణ సమాప్తయోగభవ నిద్రాధీన! దేహప్రభా
కాండాకల్పిత వర్షకాబ్దరుచి చక్రా! వేంకటేశప్రభూ!

శా. సంతానంబులు కామధేనువులు యుష్మత్సత్కృపాపాంగకో
ణాంతశ్శక్తిని గాంచఁ గల్గునోకో? యేలా వాని కాసింప? దే
హాంతం బొందుట, స్వర్గమేఁగుట, యటఁ యాచించు టీబాధ లా
వంతే నున్నవె నీకటాక్షమున కన్నా వేంకటేశప్రభూ!

శా. సీమాతీతభవత్కృపామృతము సంజీవింపఁగా జేయు నీ
నామం బెప్పుడు సంస్మరించుజనునిఁ వ్యాధివ్యథల్ ద్రోలి యం
చామాణవ్యము లోకు లెల్లపుడు దేవా కావవే యంచు నీ
నామంబుఁ జపియింత్రు మంత్రమటు లన్నా వేంకటేశప్రభూ!

మ. తొలఁగింపంగదె వ్యాధిబాధలను వైద్యుం డట్టులో యేడుకొం
డల వెంకన్న యటంచు మ్రొక్కుకొను నంతఁ భక్తసంఘామయం
బులఁ దూలించి తదర్పితద్రవిణముల్ పూజాదిఁ గైకొంచు భా
సిలు నాసత్యవిలాసివైతివి భువిఁ శ్రీవేంకటేశప్రభూ!

శా. వర్ధిష్ణుస్వయశోభ్రగాంగసలిల ప్రక్షాళితాజాండ! సం
స్పర్ధామర్దితదైత్యకాండ! కరినాసాతుల్యదోర్దండ, స
ర్వార్థాపాదికటాక్షదండ! ముకురస్వచ్ఛప్రభాగండ! యా
నర్థక్యాకరదుష్టసంహరణచండా! వేంకటేశప్రభూ!

శా. గుంజన్మంజులభూషణ ధ్వనికి వక్షోజంబు లుల్లాడఁగా
సంజాతస్మితసంవృతోష్ఠరుచు లెచ్చన్ మోగులే గోపికా
పుంజంబై విహరింప వెంటఁబడియెన్ మోహించి నీయంతవాఁ
డుం జాయావశులౌట లెక్కె మముబోఁటుల్ వేంకటేశప్రభూ!

శా. ఈయి ల్లీధన మీసుతుల్ హితులు నీయిల్లాలు నీబంధు లీ
కాయం బుండెడుదాఁకఁగాని యటుపైఁ గాసంతదూరంబు రా
రాయర్థంబునఁ దోడునీడయగు ని న్నర్చింపఁగాఁగల్గు నా
శ్రేయం బేలవమైన నున్న నదియే వేంకటేశప్రభూ!

మ. వలదే పాడుమనంబ! మర్త్యులకు సేవన్ జేయఁ గాంక్షింపఁగాఁ
గలఁకంజెందుట తక్కఁ గల్గునొకొ సౌఖ్యంబింత; రాఁజోవు పు
ట్టుల నైనన్ సుఖయింతు శేషగిరిచూడ్కిన్ దేవు నిడ్డేనియున్
దలఁపం జూడు మటంచుఁ దెల్పు వినదన్నా! వేంకటేశప్రభూ!

శా. కాంతాప్రేమముఁగోర, కర్థముల నాకాంక్షింప, కత్యుద్ధత
స్వాంతున్ నమ్మి శ్రమంబుఁజెందకు కృపావారాశిమంగామనః
కాంతశ్రీపద సంశ్రయంబుఁ గని సౌఖ్యం బందుమా నిత్య మో
స్వాంతంబా! యని తెల్పుచున్న విన దన్నా వేంకటేశప్రభూ!

శా. భార్యాపుత్రసుహృద్బ్రజిష్యచయముల్ ప్రాణావసానంబునన్
ప్రార్థ్యం బూని దహింతు రం చెటిఁగియున్ గాయంబ! తత్సేవలన్
ధుర్యత్వంబు వహింతు వేల? చలతన్ బోఁగొట్టు మంగాపతిన్
సూర్యారాధితుఁ గొల్వు మన్న విలపించున్ వేంకటేశప్రభూ!

శా. ఈరోగంబు హరింపవే యనుచు నీ వెంతేని బ్రార్థింప ము
న్నారోగ్యంబు నొసంగు వేంకటపతిన్ ధ్యానించి సేవింపుమా
క్రూరుం డైనమదీయజీవుఁడ! కృతఘ్నున్ నిన్ను శిక్షించు లో
కారాధ్యుం డతఁ డంచుఁ దెల్ప వినఁ డన్నా! వేంకటేశప్రభూ!

శా. ఆయుష్యంబు సగంబు చెల్లెఁ హరి నాఁ డర్పింప పీయర్ధ మీ
చాయన్ గొల్వక పుచ్చితేని యిఁక నీజన్మంబు వ్యర్థంబు సు
మ్మా యంతఃకరణంబ! మూర్ఖజనసమ్మానమ్ము వాంఛింప కం
చాయాసూక్తుల మందలింప వినదన్నా! వేంకటేశప్రభూ!

మ. కుచముల్ జ్ఞానమలిమ్లుచమ్ములు సుదృక్కోణంబు శాణంబు మై
రుచి మాయారుచి యంచుఁ దెల్పినను సుభ్రూరత్నమున్ గూడ ని
ర్విచికిత్సంబయి యేల చిత్తమ!మహార్తిం బొందె దీశార్చలన్
బచరింపన్ సుఖయింతు వన్న విన దన్నా వేంకటేశప్రభూ!

శా. వాతాకంపిత దీపమట్లు నళినీపత్రస్థితాంభఃకణ
వ్రాతంబట్లతిచంచలం బయినయీస్వాంతంబు రేయుం బవల్
నీతిం బాపి ననుం గ్రసించెడిని దండ్రీ తచ్చపలత్వంబు ని
ర్ధూతం బౌనటు కాలఁ ద్రొక్కి నిలు మందుం వేంకటేశప్రభూ

మ. పరయోషాకుచకుంభదర్శనసముద్భ్రాంతుఁడనై నీశుభం
కరపాదాంబురుహద్వయిం మనమునం గై సేయఁగా లేక యీ
నరజన్మమ్మున నే పశుత్వమును సంధానించుకొన్నట్టి యీ
దురితంబుం హరియించి కావ శర ణందుం వేంకటేశప్రభూ!

మ. కలిగెంబో కృప నీకు భక్తునెడ లెక్కల్ వ్రాయఁగాఁ జిత్రగు
ప్తులు వేమందియుఁ జాలనట్టియఘసంపూర్ణాత్ము సైతంబు వ
త్సలతం ముక్తు నొనర్తు; లేనియెడ లక్షల్ వత్సరంబుల్ తపం
బుల సుక్కం గన వేము చిత్రచరితంబుల్ వేంకటేశప్రభూ!

మ. శరవాలంబుల భిండిపాలములఁ జక్రప్రాసవజ్రాయుధో
త్కరఘాతంబులఁ ద్రెవ్వ కుండెడుదురంతంబైన తృష్ణాలతన్
గరుణాపూర్ణకటాక్షసంతతులఁ ద్రుంగం జేయు దీ వందు ర
బ్బురముంగూర్చు వినంగ నీదు చరితంబుల్ వేంకటేశప్రభూ!

మ. గురువుల్ ధీరవిచారులై తెలిపినన్ గూపస్థమండూక దు
స్సరణిన్ సంసృతికూపమందుఁ బడి విజ్ఞానంబు నాసింప క్షా
దరియై పోయి జనుండు నారకసముద్రప్రీడలన్ జెందు న,
చ్చెరు వీలోప మెఱుంగువాఁడు గలఁడే శ్రీవేంకటేశప్రభూ!

శా. అజ్ఞుండై యొనరించు దుష్క్రియకుఁ బ్రాయశ్చిత్తమే యుండు స
ర్వజ్ఞుం డౌ నెడఁ బాపకృత్యములఁ జేరన్ బోఁడు నా కేల యీ
ప్రాజ్ఞంమన్యత నిచ్చి నన్ను నుభయభ్రష్టాత్ముఁ గావించినా
వజ్ఞుం జేసినఁ గొంత మేలె యగుఁ గాదా వేంకటేశప్రభూ!

మ. హరినీలప్రతిమాన దేహరుచు లం దందున్ విజృంభింపఁ గ
ప్పురపుంబల్కులఁ జిల్కు లేనగవునన్ బాల్పొందునీమూర్తి ని
ర్జరకల్లోలవతీకళిందతనయాసంగంబటుల్ గొల్చున
న్నరుతాపత్రయ మార్చి ప్రోచుఁ గద యన్నా వేంకటేశప్రభూ!

శా. మోఁకా లెత్తగు మెట్లతోఁ దనరునీ మోఁకాలిశైలం బెటో
ప్రాఁకంజాలియ యేని నీమృదుపదాబ్జచ్ఛాయ విశ్రాంతులన్
గైకొన్నట్టినరుల్ తరింతురు భవాగాధాబ్ధి నానందము
ద్రాకారంబుల జానుదఘ్నముగ నన్నా వేంకటేశప్రభూ!

శా. చుక్కల్ నాకమునుండి రాలఁగను, జక్షుర్ద్వంద్వమున్ రక్తపుం
జుక్కల్ గ్రక్కఁగ నీదుచుక్కలగిరిన్ మెట్టుచున్ భక్తితో
జొక్కుం జెందు నెవండు; వాఁడె సిరియో చుక్కా యగున్ జుమ్మనీ
దృక్చక్కవల్యరమాస్వయంవరమునన్ శ్రీ వేంకటేశప్రభూ।

శా. ద్యావాపృథ్వ్యవకాశపూర్ణ మగు నీధాత్రీధరం బెక్కుచున్
గోవిందా యని బొబ్బ వెట్టుచును భక్తుల్ మేను పొంగార నా
నావిభ్రాంతులు వాసి యోంకృతికళానాదానుసంధాన సౌ
ఖ్యావిర్భూతిని జొక్కుచుందురు గదన్నా వేంకటేశప్రభూ!

శా. నీవే నే ననునిశ్చయంబుఁ గని నిర్నిద్రప్రభారూపునిన్
భావాతీతుని నిన్నుఁ గాంచి మది దర్పం బంద మే లౌను గా
నీవెన్వెంటనె ప్రుగ్గుదేహము సుతానీకంబ యే నం చవి
ద్యావార్ధిం బడి మున్గి మిట్టిపడు టేలా వేంకటేశప్రభూ!

శా. విష్వక్సేన! యభీష్టదాననిపుణోర్వీలోకసంతాన! శృం
గేష్వాసార్దితదైత్యసేన! యఘదాహిస్వర్ణసంవ్యాన! పు
ష్పేష్వాసాంగనిదాన! మానిజనతాహృత్స్థాన! భాస్వత్తరా
భీష్వభ్యంతరరాజమాన! కరుణాబ్ధీ వేంకటేశప్రభూ!

శా. పూలన్ బూజయొనర్పఁ బల్కవు ముఖంబున్ జూప వృక్కింతయున్
జాలిం బొందవు మంటియుండలను బుష్పస్రగ్విధం బొప్పఁగా
మాలిగ్ గూర్చెద నంటినో, సరసికై మ న్నెల్ల నేఁ ద్రవ్వుదున్
వైళం బీ వది మోయు మంటినొ శరణ్యా! వేంకటేశప్రభూ!

మ. కలవాఁ డౌనెడఁ దాఁ దినన్ వలెఁ దనున్ గాంక్షించు నవ్వారి కీ
వలెఁ గానీ శ్రమమోర్చి, దూర మగునీవాసం బెటో చేరి క
న్నుల నీపావను లద్దికొంచు వినుతన్ బూజింపఁగాఁ జెప్పవే
బ్బలఁ గొట్టింతువు భక్తులౌ దగునె శ్రీపా! వేంకటేశప్రభూ!

మ. ధనమో రత్నమొ కాంచనంబొ తృణమో ధాన్యంబొ వస్త్రంబొ శ్రో
న్నసయో, పత్రమొ, పండొ, కల్గినది పుణ్యం బబ్బు నం చెంచి య
ప్పన గావించెడువారికిన్ బ్రతిఫలంబా! శ్రీహరీ శీర్షముం
డన సత్కారముఁ జేసియుం పెదవు వేడ్కన్ వేంకటేశప్రభూ!

శా. నిచ్చల్ కన్నులు విచ్చియుండియు మఱుఁ వీక్షింప, వాలింప వ
త్యుచ్చైఃకంఠముతోడఁ బిల్చినను, నోహోయంచు మాటాడ వీ
మెచ్చుల్ గచ్చులు లక్ష్మితోఁ గలుగు నీమీసాలలోనవ్వ, లీ
మచ్చుల్ నైజగుణంబు లాఢ్యులకుఁ జుమ్మా వేంకటేశ ప్రభూ!

శా. ఆభీరీపరిరంభ చుంబనలతాంతాస్త్రాహవప్రోన్మిష
ల్లోభస్వాంతుఁడవై చరింతు వపు డేదో యయ్యె; నేఁడైన నీ
వీభిల్లీకిలికించితాదికముఁ దేకాగ్రతఁ మాని య
య్యో భక్తార్తిఁ దొలంచుబుద్ధి యిఁక రాదో వేంకటేశ ప్రభూ!

శా. అర్ణోరాశి సివాసివాట నెటు నిన్నర్చింతు మం చెంచ న
భ్యర్ణంబందునఁ దోఁచినట్టులయి యా అద్రీంద్రముల్ దాఁటి దృ
క్పూర్ణశ్రీశాద్రిని వెన్నుదన్ని వెలుఁగంగాఁజొత్తు, నీకోరికల్
పూర్ణంబయ్యెనె? భక్తరక్షణ మిదే పో వేంకటేశ ప్రభూ!

మ. సిరులున్ స్వర్ణమణీమయాభరణకౌశేయాదులున్ గోవులన్
గరులన్ సారెగఁ దల్లిదండ్రు లొసఁగన్ బద్మావతీదేవి గొం
చరుదే నం దొకయాకు లే దని యహార్యం బెక్కు నీవంట నీ
సరసత్వంబు నలౌభ్య మే మనెద నీశా వేంకటేశ ప్రభూ!

మ. అలమేల్మంగను ముద్దరాలి నటు దూరాధ్వంబునం దాఁపి కొం
డల నెక్కన్ దగ దంటివంట సరియె! తా నైన సమస్తార్థపు
ష్కలమంగాపురమున్ రచించుకొన, నిచ్చల్ కాల్నడన్ రేయి నా
చెలికై రా నెటు సిగ్గుమాలితివొ యిస్సీ వేంకటేశ ప్రభూ.

శా. నీవాంఛించినదాన మిచ్చు బలినిన్ శిక్షించి పాతాళలో
కావాసమ్మున కంపినావు నిను నన్యాయంబుగాఁ దన్ను భూ
దేవున్ బాదములొత్తి మ్రొక్కి తటుగాదే మెత్తనౌవారి న
ట్లావం తేనియు ధూర్తుఁ మొత్తఁగలరయ్యా వేంకటేశ ప్రభూ.

మ. మురియంజూతువు పత్రమో సుమమొ సొమ్మో యిచ్చిన న్నావు నీ
రరుహాక్షా యని వేడఁగా; నడుగువారల్ లేక గానీ కరిన్
నరుఁ బ్రహ్మాదు విభీషణున్ ధ్రువునిఁ జెంతన్ నిల్పి నావార లం
చరయన్ వా రెది యిచ్చిరో తెలుపుమయ్యా! వేంకటేశ ప్రభూ!

శా. నిన్నుం జంపెద మన రక్కసుల కేనిన్ మోక్షలక్ష్మీవిలా
సౌన్నత్యమ్మను గూర్చి మాదృశుల నోరారన్ స్తుతుల్ సేయువా
రి నైరస్య మెలర్పనైనఁ గన వేరీతిన్ ననున్ జూతుగా
కెన్నండ ట్లొడిగట్టు దుష్క్రియకుఁ దండ్రీ వేంకటేశ ప్రభూ!

శా. వేషంబుల్ ధరియించినావు పదులున్ వేల్ లక్షలున్ గోటులున్
యోషావేషము గూడఁ దాల్చి తెటు నిన్నుం గాంతు నన్నింటిలో
నీష త్తేజముతోన తళ్కు మను చుండే జ్ఞాననేత్రమ్ము శ్రీ
భూషా యిచ్చి, యొసంగు దర్శనఫలంబుం వేంకటేశ ప్రభూ!

మ. సురలున్ యోగులుఁ గొల్వరే సతము ప్రాజ్ఞుల్ గాన మోక్షార్థులై
త్వరపెట్టం గమకించిరే యన కమర్త్యత్వంబె నా కున్న సు
స్థిరభక్తిన్ భజియింతు; మృత్యువదనాసీనుండనై యుంట నీ
కరుణన్ వేగమ చూపు మందు మది శంకన్ వేంకటేశప్రభూ!

మ. హరియో శంభుఁడొ యంబయో సలిలజాతాప్తుండొ శ్రీమద్గణే
శ్వరుఁడో యెవ్వరు గాని యొక్కటియె సర్వంబీవ, పేరెల్ల నీ
పరరూపంబులె యంచు నెంచి కొలువన్ స్వాంతంబు నర్పింతు నె
ట్లుర వౌనో యటు చేసి మోక్షసుఖ మిమ్మా వేంకటేశప్రభూ!

మ. అడవిన్ దండ్రి! జలంబు లిమ్మని పిపాసాయాసఖిన్నుండనై
యడుగన్ లేదాకో నీవ యెవ్వనినో యన్నా! యట్టులే తృష్ణచేఁ
బడి నీయట్టిమహానుభావుని దయాపానీయ మిమ్మంచు నే
నడుగం దప్పౌనొ న్యాయమే నొసఁగ వేలా వేంకటేశప్రభూ!

శా. దంభాచారత వేషధారి యయి సంధ్యావందనాద్యక్షరా
రంభం బైన నొనర్ప లేనిజడునిన్ బ్రహ్మణ్యుఁ గాఁ జూపుచున్
దంభాదిన్ విడనాడుజ్ఞానికి జడత్వం బూన్చుచున్ మాయ పా
పాంభోధిన్ జనకోటిఁ ద్రోయ గనుచుండా వేంకటేశప్రభూ!

మ. నియతిం దప్పక నిన్నుఁ గొల్చెడుమహానిష్ఠాగరిష్ఠాత్ము, న
క్షయదుఃఖంబులఁ ద్రోచి యగ్నిని బరీక్షం జేసి యాపైని ని
ర్భయకైవల్య మొసంగె దీ వఖిలభావజ్ఞుండవై యిట్టిదు
ర్ణయమున్ బూనుట యేమినీతిర యనంతా వేంకటేశప్రభూ!

శా. వేదాంతంబులఁ బాదచారివయి యన్వేషించుయోగీంద్రచి
త్తాదర్శంబుల నీడవై మలసి, మాయం బాచు ధావించునా
ఖేదం బేటికిఁ దండ్రి! మామకమనోగేహంబునం దుండి స
మ్మోదం బందుము నీది కాదె సకలంబున్ వేంకటేశప్రభూ!

మ. శతకోటిద్యుమణిప్రభాకలితమై సద్భక్తలోకాంతరం
గతమస్సంహరణోత్సుకంబయి, భవద్గ్రైవేయడోలాంతర
స్థితమౌ కౌస్తుభరత్న, మస్మదఖిలాస్మిప్రాంతపర్యాప్తగా
ఢతమఃపుంజ మడంచుఁ గాత ధృతకాండా! వేంకటేశప్రభూ!

మ. కుసుమస్యందిమరందబిందులహరీగుంజన్మిళిందాంగనా
విసరంబై హృదయంగమం బయి భవద్విస్తారివక్షస్స్థలా
వసథం బౌ వనమాలికల్ పరిమళవ్యాసంగలీలాప్తి నా
రసి నాయింద్రియముల్ గరంచు సుఖ మూరన్ వేంకటేశప్రభూ!

శా. అస్మన్మానసగేహసంతతనివాసారాతిషడ్వర్గముక్
భస్మీభూత మొనర్చుత న్, సురసపత్నస్వామిహృచ్చేతనా
పస్మారప్రతిపాదిఘోరరవమౌ త్వత్పాంచజన్యంబు, మం
దస్మేరాంచితయుష్మదోష్ఠసఖ మన్నా వేంకటేశప్రభూ!

మ. వినమత్స్వామరాజరక్షణమునై, విక్రాంతనక్రాసుద
ర్శనమై, సంతతసేవ్యమానజనరక్షాప్రక్రియాదివ్యద
ర్శనమై, దుర్మదకర్శనం బయి భవచ్చక్రాయుధం బౌ సుద
ర్శన మస్మద్దురితంబుఁ దూల్చు జగదీశా వేంకటేశప్రభూ

మ. రణరంగాహతదైత్యశేఖరచమూరక్తాస్థిమేదోవసా
ర్ద్రాణశోభాయుతమై, సమస్తదురితప్రధ్వంసనాభీలమై
యణిమాద్యష్టవిభూతిసంకలితమై యత్తాదుకౌమోదకీ
ప్రణుతుల్ సేసెద నాయఘంబులు కలంపన్ వేంకటేశప్రభూ!

శా. ప్రత్యగ్రోత్థమృణాళనాళవిధమై భాసిల్ల దోర్దర్పవ
ద్దైత్యస్వామిశిరోధినాళముల నత్యాసక్తి ఖండించి ని
ష్ప్రత్యూహంబుగ సర్వలోకముల సంరక్షించునీనందకం
బత్యూర్జం బయి ప్రొంచు నాదగునవిద్యన్ వేంకటేశప్రభూ!

శా. వర్షాకాలపయోదముక్తశరసంపచ్ఛోభితమై, శాత్రవా
మర్షోత్కర్షవిజృంభితానమనశుంభద్వేగనిర్ముక్తదు
ర్ధర్షక్రూరశరప్రవృద్ధ మగు శార్ఙ్గం బెప్పుడున్ మన్మనో
హర్షధ్వంసకచింతలన్ గలఁచు దేవా వేంకటేశప్రభూ!

మ. రమమాణశ్రీవతంసమానససరోరాజీవమై, సంసృతి
శ్రమనిర్వాపణకౌసుమవ్యజనమై, సౌవర్ణమంజీరితా
గమమై, సద్వసురేంద్రమౌళిమణిరాగచ్ఛన్నమై నీపదా
బ్జము నాడెంద మలంకరించుఁ గమలాక్షా వేంకటేశప్రభూ!

శా. ఏలా తొల్లి సృజించినాఁడవు ననున్, సృష్టింతు పో యున్ననా
కేలా ప్రోచితి, ప్రోచినందులకు నామేను ధన్యంబుగా
నేలా నీచరణారవిందయుగళీభృత్యత్వసామ్రాజ్యలీ
లాలాలిత్య మొసంగకుంటి విది మేలా? వేంకటేశప్రభూ!

మ. మలమూత్రాసృగ్వసాదులన్ బొరలుచున్ బంచేంద్రియంబుల్ వశం
బులు గామిన్ జలియింప నేరక సతంబున్ జాఠరాగ్నిద్యుతిన్
బొలివ్రో నేడ్చితి మాతృగర్భనరకంబుల్ చెంది వేమాఱు లీఁ
దలఁపం బోకుము దానిమ్రా మిఁకమీఁదన్ వేంకటేశప్రభూ!

శా. కాంతాసౌఖ్య మెఱింగితిన్ సుతులసౌఖ్యంపుంజవిం గంటి శ్రీ
మంతుల్ గొల్చి తదాత్తభోగమహిమం బాటించితిన్, సర్వమున్
చింతాహేతువు లయ్యెఁ గాని మదికిన్ జేకూర్ప వానంద మొ
క్కింతేనిన్ గృపఁ జూపి చిత్సుఖము నీవే వేంకటేశప్రభూ!

శా. గోవిందా! పరదా! మునీంద్రవినుతా! గోపాలబాలా! జగ
ద్భావాభావనిదాన! భక్తజనహృత్పంకేరుహేందిందిరా!
దేవా! వేంకటనాయకా! యనుచు నర్థిం బొంగు చానందపా
రావారంబగువాఁడె ధన్యుఁడు గదన్నా! వేంకటేశప్రభూ!

శా. చింతారత్నసదృక్త్వదీయపదరాజీవద్వయీచింతనా
త్యంతస్వాదుసుధాప్రపూరముల నాస్థన్ గ్రోలి మత్తిల్లుచున్
స్వాంతంబందొకచింత లేక దినముల్ సాగించినం జాలు నా
వంతే నన్యము కోర నమ్ము మిది శ్రీశా వేంకటేశప్రభూ!

శా. నీలాంభోధరమండనైంద్రధనురున్మేషంబు పోషించుత్వ
న్నీలాంగద్యుతిమండలోపరిచలన్నీలాలకాభ్యంతరో
ల్లోలాగ్రాంచలబర్హిపింఛము జగన్మోహంబు పాటింప నీ
వేలా దర్శన మీయ వింకను మురారీ వేంకటేశప్రభూ!

శా. త్రైలోక్యాభ్యుదయప్రదాయకములై తాపత్రయోన్మూలన
శ్రీలై పుల్లనవారవిందరుచిధారేయంబులై సత్కృపా
మూలాధారము లౌ త్వదీయనంబుల్ విచ్చి లీలార్ధమే
నాలోకింపవె మామకార్తితతి మాయన్ వేంకటేశప్రభూ!

మ. వ్యయ మయ్యెన్ ధన మాప్తు లెల్లఁ బరిచర్యల్ సేయ నెన్నాళ్లనుం
డిరొయి బాధల్ పడుచుండి రౌషధము లెన్నే ద్రింగితిన్ గాని నీ
దయ సాయం బొనరింప కుంట నవి వ్యర్థం బైన యట్లుండె నా
పయి కీనాఁటికినైనఁ జూపు మనుకంపన్ వేంకటేశప్రభూ.

శా. శ్వాసం బాడదు కాలుసేతు లవశత్వం బూనె దేహంబునన్
దోసంబుల్ ప్రతిలిప్తయున్ బెరుఁగుచుండున్ గ్రొత్తలై యిట్టు లా
యాసంబెట్టుటకంటె నొక్కపటి న న్నంతంబు నొందింప రా
దే సంరక్షణ మన్నఁ గష్ట మగుఁ గానీ వేంకటేశప్రభూ.

వ. వల దీమందులు మ్రాఁకులున్ గలియుగప్రత్యక్షదేవుండు నా
యిలువేల్పై వెలయంగ నంచు మదియం దింతేని జింతింప నం
దులకా యిట్టు లుపేక్షఁ బూనితివి నాదుర్బుద్ధి మన్నింపు వై
ద్యులటుల్ నీవును వీడుచో బతుకు టెట్లో వేంకటేశప్రభూ.

శా. ఏలా భీతిలు టందు వేమొ యిదె నాయిష్టుల్ సుహృద్వర్గముల్
వేలాతిక్రమణంబు గాక మునుపే వి ల్లొక్కటై వాయు మం
చాలోచించియె కాగితంబుఁ గలముల్ హస్తంబునన్ బెట్టి రిం
కేలా జీవితవాంఛ నాకిపుడు తండ్రీ వేంకటేశప్రభూ.

శా. ఆయాసంబున నొత్తగిల్లుట యశక్యం బయ్యె నేదేనియుఁ
బ్రాయన్ దిమ్మిరిఁ గేలు రాదు చరియింపన్ భూమిఁ గాల్వెట్టి యేఁ
డాయెన్ గాయము నీరువట్టె స్మృతియున్ వ్యత్యస్త మై చుండె నే
లా యింకన్ గనకుంటి బాధపడఁ జాలన్ వేంకటేశప్రభూ.

మ. పితృదేహాంత మొనర్చి నప్పులను గల్పించెన్ దురంతామయ
క్షతదేహుల్ సలిపెన్ ధనవ్యయము హెచ్చన్ జేసె నీ యిట్టిదు
ర్మతినిన్ దుందుభి వేసి వేగఁ దొలఁగింపన్ జూడ వే లన్న? యీ
స్థితి సైతంబును మించుచుండెఁ గనవె శ్రీవేంకటేశప్రభూ

మ. మతిమన్మాన్యతఁ గాంచు నొక్కకృతి నిర్మాణంబు గావించి శ్రీ
పతి కర్పించి తరింతు నంచు మదిలో భావించునా మాశ యీ
గతి నున్మూలిత మాట కెంతయును దుఃఖం బందెదన్ గాని య
న్యతమార్థ్యంశము లేదు లేదు సుమి యన్నా వేంకటేశప్రభూ.

శా. అన్నన్ నమ్మి ననున్ సగోత్రుఁడగు రామాఖ్యానుపుత్రుండు గా
ము న్నర్పించినతండ్రి యన్నమృతిచేఁ బ్రోవేది నన్ జేరుటన్,
గన్నీ రబ్ధిగఁ గుందుచుండె శ్రితరక్షావృత్తి వా దం డ్రైపై
న న్న బ్రోచి తవార్తి మానుపఁ గదన్నా వేంకటేశప్రభూ.

శా. ఆరోగ్యంబు లభించి నిల్చునెడ నీయాఖ్యన్ శతగ్రంథమున్
జారుప్రక్రియ వ్రాసి నీచరణకంజాతంబులం దుంచి సం,
సారాంభోధిఁ దరింపఁ గాఁ దలఁచుకాంక్షన్ వ్యర్థమో సార్థమో
యేరీతిన్ బచరింప నెంచితివొ తండ్రీ వేంకటేశప్రభూ.

బె జ వా డ

వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1934.